ఓం

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర స్వామినేనమః.





# శ్రీ విఘ్నేశ్వర పూజావిధానము.



పండిత పరిష్కృతము.

బెజవాడ

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరాంధ్ర గ్రంథాలయ
సంఘమువారిచే బ్రకటితము.

1932

ఓం

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర స్వామినేనమః.



# శ్రీవిఘ్నేశ్వర పూజావిధానము.




ప్రథమ ముద్రణము.

పండితులచేఁ బరిష్కరింపఁబడి,

బెజవాడ

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరాంధ్ర గ్రంథాలయసంఘము

వారిచేఁ బ్రకటింపఁబడినది.

1932

 మూల్యము.



శ్రీ గోపాలకృష్ణ ఆయిల్ మిల్ కంపెనీ, మానేజర్లు,

మ॥రా॥రా॥శ్రీ

గోపు బాలకృష్ణయ్య, బచ్చు క్రిష్టయ్య

ఫరంవారు, బెజవాడ,

రాజపోషకులు,

1932.



మ॥రా॥రా॥శ్రీ

మనికొండ వెంకటనరసింహ్వాం

గుప్తగారు,

శ్రీ దుర్గా మల్లేశ్వర స్వామివారి
దేవస్థానపు ట్రస్టీ అండ్
మ్యునిసిపల్ కౌన్సిలర్, బెజవాడ,

రాజపోషకులు,

1932.

VII

# విషయసూచిక.

## నిర్విఘ్న గణాధిపతి (పసుపుగణపతి) పూజ.


| | పుటసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|---|
| ఆచమనమ్. | 1 | షోడశోపచారపూజలు. | 6 |
| లఘుసంకల్పమ్. | 2 | నైవేద్యము. | 7 |
| ధ్యానమ్. | 3 | నీరాంజనమ్. | ,, |
| కలశపూజ. | 4 | మంత్రపుష్పమ్. | 8 |
| ప్రాణప్రతిష్ఠ | 5 | ఉద్వాసన | ,, |


## వరసిద్ధివినాయకుని పూజ.


| | పుటసంఖ్య. | | పుటసంఖ్య |
|---|---|---|---|
| | | మంత్రపుష్పమ్. | 25,27 |
| ఆచమనమ్. | 9 | గరికెపూజలు. | 28 |
| మహాసంకల్పమ్. | 10 | అర్ఘ్యము. | ,, |
| కలశపూజ. | 11 | వాయనదానము. | 29 |
| ప్రాణప్రతిష సంకల్పం. | 12 | ప్రతిమాదానం | 31 |
| కరన్యాసము | ,, | లఘుకథ. | ,, |
| అంగన్యాసము | 13 | ఉద్వాసన | ,, |
| ప్రాణప్రతిష్ఠమంత్రం. | 14,15 | ప్రార్థనాశ్లోకములు. | 32 |
| పంచామృతము. | 17 | పద్యములు. | 32,34 |
| అంగపూజ | 19 | పంచరత్నములు. | 34,35 |
| ఏకవింశతిపూజ. | ,, | దండకము. | 35,37 |
| శతాష్టోత్తరనామపూజ. | 21 | మంగళహారతి. | 37,38 |
| ధూప,దీపనైవేద్యములు. | 24 | లాలిపాట. | 39 |
| నీరాంజనమ్. | ,, | కథమహాత్యము. | 39,45 |

శ్రీ

ఓం

# పీఠిక.

పాఠకమహాశయులారా!

1. హిందూసాంప్రదాయములలోనెల్ల దైవవ్రతములు సర్వజనాదరణీయమై సారవంతమైన ఫలోద్దేశ్యములను అనాది నుండి దేశమెల్లెడలను ప్రతిష్ఠించుచున్నది. ఇట్టి వ్రతములలో కెల్ల యీగణనాయకుని వ్రతము శ్రేష్ఠమైనదని చెప్పుట సాహసము కానేరదు. సమస్తకార్యములయందును ప్రధానాంగముగా కార్యసిద్ధి నిమిత్తమై యీ గణనాధుడు పూజింపబడుటయే దీనికి తార్కాణము. విచారించిచూడగా సాక్షాత్తు యీ దేవతయే త్రిమూర్తులకును ఆదిపురుషుడుగా విరాజిల్లుచున్నాడు. త్రిమూర్త్యాత్మకమైన ఏ చైతన్యస్వరూపము యీ జగదధిష్టానముగా నుండి సృష్టిస్థితిలయములను జేయుచు సర్వవ్యాపకమై మూర్తామూర్తములయందు నిండియుండి దేవతాస్వరూపములతో జగత్కార్యమును నిర్వహించుచున్నదో అట్టి సర్వాధారమైన మహాశక్తియే యీ విఘ్నేశ్వరునియొక్క స్వరూపముగా గణపతిపురాణము మొదలగు వానిలో తెలియబడుచున్నది. ఈ మూర్తికి తేజోవైభవము చేత పెక్కు అవతారములును వాటియందు సాధించబడిన అనేకాత్యద్భుత మహిమోపేతములయిన కార్యవిశేషములును గూడ పై గ్రంథరాజములయందు చూపట్టుచున్నవి.

2. అత్యుత్తమమైనటువంటిన్ని, సులభమైనటువంటిన్ని ఈ వ్రతము బహుజనులకు ఆచారసిద్ధముగానుండి అలవాటులోనిదగుటచేతను దీనియొక్క ఉత్కృష్టతను పలువురు గ్రహించుటవలనను సామాన్యముగా ఆదినము అందరికి పురోహితులయొక్క యాజమాన్యము దొరకుట దుర్లభమగుటచేతను గ్రంథములలో యీ వ్రతముయొక్క విధానము పూర్తిగా వెలువడియున్నను శాస్త్రసాంప్రదాయములయందు ప్రవీణులు గానివారలకు మంత్రములు మొదలయిన పూజాకలాపములయందు అర్థపరిచయముగాని క్రియాపరిశేషణముల యొక్క అనుభవముగాని లేని కారణమున పామరులు కూడ యిబ్బందిలేకయే ఈ మా పుస్తకసహాయముచేత వ్రతమును జయప్రదముగా సమాప్తినొందించుకొనుటకు తగినదిగా కావలసిన ఉపపత్తులన్నియు గూర్చి దీనిని ముద్రింపించుట ఆవశ్యకమైనది.

3. ప్రతి భాద్రపద శుద్ధ చవితి నాడు అందఱును నుదయముననే మేలుకొంచి నిత్యకృత్యములను దీర్చికొని, విఘ్నేశ్వరునిపూజకు వలయు ద్రవ్యములను సేకరించుటకు, హెచ్చరికతో పని చేయవలయును. పూజాద్రవ్యములు అనగా పసుపు, అక్షతలు, గంధము, కుంకుమ, తమలపాకులు, వక్కలు, ఫలములు, పంచామృతములు (ఆవుపాలు, పెరుగు నెయ్యి, తేనె, చక్కెర) హారతికర్పూరము, సాంబ్రాణి, వత్తులు, పువ్వులు; మామిడి, నేరేడు, ఉత్తరేణి, జమ్మి, గన్నేరు మొదలగు పత్రి ప్రతిదినుసునకు నిరువదియొకటి,

చొప్పున సంపాదించవలెను. ఇంటియందు తూర్పుభాగమున గాని ఉత్తరపుదిక్కున గాని గోమయముతో శుద్ధిచేసి చిత్రములైన పంచవర్ణముల ముగ్గులతో నలంకరించి ఒక పాలవెల్లి, మంటపమును తమ శక్తికొలది నిర్మించవలెను. పిదప ధనలోపము చేయక వెండి బంగారుతోనైనను, తుదకు మృత్తికతోనైనను చేయించిన గణపతి ప్రతిమను పసుపుతో నలంకరించిన నూతనవస్త్రముపై బియ్యముతోగాని, వడ్లతోగాని నేర్పరచిన వేదికయందు నుంచి స్వామిని ప్రతిష్ఠించవలయును. ఉపవీతము, గొడుగు, మధుపర్కము, మొదలగునవన్నియు సమీపమున పళ్లెరములో నుంచి స్నానముచే పవిత్రుడై ఆవునెయ్యితోగాని, నువ్వులనూనెతోగాని, దీపారాధనచేసి నమస్కరించి, వ్రతసమాప్తికొఱకు పూజాక్రియాములు నిర్విఘ్నముగా జరుపుటకై ఒక ఆకుయందు పసుపుతో విఘ్నేశ్వరుని నుంచి సంకల్పవిధానముగా స్వామిని షోడశోపచారములతో లఘువుగా పూజ చేయవలయును.

అనంతరం వరసిద్ధివినాయకపూజ చేయవలెను.

**4.** ఈ పుస్తకములో అందరకు నుపయోగించునటుల ప్రార్థనశ్లోకములు, పద్యములు కీర్తనలు, పాటలు వారివారి రుచి ననుసరించి ఉపయోగించుకొనులాగున చివరభాగమున విశేషముగా చేర్చడమైనది. పూజాసందర్భములో స్వల్పావకాశము చూచుకొని గణపతి అష్టోత్తరము చెప్పబడినను శ్రద్ధాభక్తులుకలవారు అవకాశము చూచుకొని సహస్రనామము చెప్పి పూజ చేయవచ్చును. యీ ప్రకరణములోనే కొందరు

నిర్విఘ్న గణపతి పూజానంతరమున సరస్వతీపూజను జరిపి, పిదప వరసిద్ధివినాయకుని పూజించుటయును ఆచారము గలదు. అట్లు చేయగోరువారు గణపతిపూజ చేయునపు డీ సరస్వతీ పేరును చెప్పుచు సరస్వతీ అష్టోత్తరమును నైవేద్యమును మాత్రము ప్రత్యేకముగా జరిపించవలెను. చవితిచంద్రుని జూచిన నింద తొలగుటకు పూజానంతరము కథ చదువుకొనవలెను అటుల కథ చదువుకొనే వ్యవధి జాలనియడల పే 31 లోని శ్లోకమును పద్యములును చదువుకొనవలయును. భోజనానంతరము పూర్తికథ చదువుకొని అక్షతలు కథ వినువారలందరుకూడ శిరస్సున ధరించవలయును. ప్రతిపూట పూజచేయుచు నైవేద్య దీపారాధనలు జరిపి తోచినపుడు ఉద్వాసన చేయవలెను. సంకల్పవిధానములో వ్రాయబడిన దేశకాలసంకీర్తనమున సంవత్సరమును వారమును కాలానుసారముగా మార్చి చెప్పుకొనవలయును. 12 వ పేజిలో ప్రాణప్రతిష్ఠ అని తెలిపిన మతలబుకు (ప్రాణపతిష్ఠ సంకల్పము) అని తెలుసుకొనవలయును. ప్రాణప్రతిష్ఠ మంత్రము 14 వ పేజీలో 10 వ పంక్తి తరువాత వున్నది.

ఈ గ్రంథాలయసంఘమునకు రాజపోషకులుగ చేరి పురోభివృద్ధికి మార్గదర్శకులైన 1. మ॥ రా॥ రా॥ శ్రీ నందిపాటి వెంకట నరసింహారావు గుప్తగారు, 2. శ్రీ గోపాలకృష్ణ ఆయిల్ మిల్ కంపెని మేనేజర్లు, గోపు బాలకృష్ణయ్యా, బచ్చు క్రిష్టయ్యా ఘరంవారు 3. శివకోటి లక్ష్మీనరసింహాం గుప్త గార్లున్ను, నూతనముగ రాజపోషకులగుటకు వాగ్దాన మొన

ర్చిన మనికొండ వెంకటనరసింహ్వాం గుప్తగారున్ను మా కెంతయు వందనీయులు. వీరల ఛాయాపటములు కూడ యిందుతో ప్రచురించడమైనది. పలువు రిట్లే మహారాజ, రాజపోషకులుగ చేరి గ్రంథాలయాభివృద్ధికి తోడ్పడి మాతృ భాషాభిమానులయి దేశారాధకులగుటకు ప్రారితులు.

5. ఈ గ్రంథము ప్రచురింపించుటలో మాకు అనేక విధములుగా తోడ్పడి సాయమొనర్చిన ఈలపోలు గ్రామ పాఠశాలోపాధ్యాయులగు బ్రహ్మశ్రీ మూర్తి సూర్యనారా యణ శాస్త్రిలుగారికిన్నీ, ఈ పుస్తకమును సరిచూచి దీనికి తగిన అభిప్రాయమును దయతో నొసంగిన శ్రీ కన్యకాపర మేశ్వరీ హిందూ హైస్కూల్ ప్రథానాంధ్రోపాధ్యాయులును విచిత్రాష్టావధాని, నాటక చక్రవర్తి, విద్వత్కవి బిరుదాంకి తులు నగు బ్రహ్మశ్రీ మల్లాది అచ్యుతరామశాస్త్రిలుగారికిన్ని తదితర పండితోత్తములకున్ను మా కృతజ్ఞతాపూర్వక వంద నము లనేకము లర్పించుచున్నాము.

వ్యవధి చాలనందున తప్పొప్పులపట్టిక ప్రకటింపలేదు. ఇందలి ముద్రణాది స్ఖాలిత్యములను విజ్ఞులు మన్నింతురుగాక.

బెజవాడ,
28-8-32.

ఇట్లు,
శ్రీ భ్రమరాంబా మల్లేశ్వ రాంధ్రగ్రంథా లయసంఘము, బెజవాడ.

---

మ. శా.— పండితుల అభిప్రాయములు పుస్తకము చివరభాగమున జేర్చడ మయినది.

హరిః ఓం.

శ్రీగణేశాయనమః.

# శ్రీవిఘ్నేశ్వరపూజావిధానము.



దీపారాధనను చేసి గంధాక్షత పుష్పములచే నలంకరించి నమస్కరించవలెను.

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా । సర్వావస్థాంగతోపివా ।
యస్మరేత్పుండరీకాక్షం । సబాహ్యాభ్యంతరశ్శుచిః॥

అని ఉదకమును తనపై ప్రోక్షించుకొనవలెను.

ఆచమ్య. ఓం కేశవాయస్వాహా, ఓం నారాయణాయ స్వాహా, ఓం మాధవాయస్వాహా,

అని ముమ్మారు ఉదకమును లోనికి పుచ్చుకోవలయును.

ఓం గోవిందాయనమః అని చేతులు కడిగికోవలయును.
ఓం విష్ణవేనమః, అని నేత్రములు తుడుచుకోవలయును.

ఓం మధుసూదనాయనమః, ఓం త్రివిక్రమాయనమః ఓం వామనాయనమః, ఓం శ్రీధరాయనమః, ఓం హృషీకేశాయనమః, ఓం పద్మనాభాయనమః, ఓం దామోదరాయ నమః ఓం సంకర్షణాయనమః, ఓం వాసుదేవాయనమః, ఓం ప్రద్యుమ్నాయనమః, ఓం అనిరుద్ధాయనమః, ఓం పురుషోత్తమాయనమః, ఓం అధోక్షజాయనమః, ఓం నారసింహాయనమః, ఓం అచ్యుతాయనమః, ఓం జనార్దనాయనమః,

ఓం ఉపేంద్రాయనమః, ఓం హరయేనమః, ఓం శ్రీకృష్ణాయ నమః, అని ఆచమనం చేయవలయును.

## భూతోచ్చాటన.

మంత్రము॥ ఉత్తిష్ఠంతు భూత పిశాచాః । ఏతేభూమిభారకాః।
ఏతేషా మవిరోధేన । బ్రహ్మకర్మ సమారభే॥

అని ఉదకమును తనచుట్టు ( కూర్చున్నచోట ) చల్లవలయును.

## ప్రణవోచ్చారణ.

యీదిగువ మంత్రము పఠించునపుడు నాశికమును (ముక్కును) మూసికొనవలయును.

మంత్రమ్॥ ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వ రేణ్యం, భర్గోదేవస్య ధీమహి, ధియోయోనః, ప్రచో దయాత్, ఓం మాపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం॥ అని ముక్కును విడవవలయును.

## నిర్విఘ్న గణపతికి లఘుసంకల్పము.

శుభే, శోభనే, ముహూర్తే ప్రవర్తమానస్య, కలియుగే, ప్రథమపాదే వ్యవహారిక చాంద్రమానేన, ఆంగీరసనామ సంవత్సరే, దక్షిణాయనే, వర్షఋతౌ భాద్రపదమాసే శుక్లపక్షే, చతుర్థ్యాం భానువాసరే శుభతిథౌ శ్రీమాన్... గోత్రస్య......నామధేయస్య వినాయకదేవతాముద్దిస్య తద్దే

వతా ప్రీత్యర్థం ఆదౌ నిర్విఘ్నేన ఉత్తరశుభకర్మణి పరిసమాప్య సిద్ధ్యర్థం గణాధిపతిపూజాం కరిష్యే॥

ఆని ఉదకమును స్పృశించవలయును.

## నిర్విఘ్న గణపతిస్థాపన.

ఒక పళ్లెరములో సపాదకముగా బియ్యముపోసి దానిపై నొక తమలపాకు తూర్పుఅగ్రముగా నుంచి పసుపువినాయకుని నుంచవలెను.

## ధ్యానము.

పుష్పముగాని అక్షతలుగాని చేతనుంచుకొని యీ దిగువప్రకారం ధ్యానము చేయవలెను.

శ్లో॥ శుక్లాంబర ధరం విష్ణుం, శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్నవదనం ధ్యాయే, త్సర్వవిఘ్నోపశాంతయే॥

శ్లో॥ అగజానన పద్మార్కం. గజానన మహర్నిశం।
అనేకదంత భక్తానా, మేకదంత ముపాస్మహే॥

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం, యాదేవి సర్వమంగళా।
తయోస్సం స్మరణాత్పుంసాం, సర్వతో జయమంగళం॥

అయంముహూర్తః సుముహూర్తోఽస్త్వితిభవన్తో మహాన్తోఽనుగృహ్ణన్తు- అయంమహూర్తః సుముహూర్తోస్తు తదేవలగ్నం, సుదినం, తదేవ; తారాబలం, చంద్రబలం తదేవ; విద్యాబలం, దైవబలం తదేవ; లక్ష్మీపతే తేఽఙ్ఘ్రి యుగంస్మరామి.

శ్లో॥ యత్రయోగేశ్వరః, కృష్ణః, యత్రపార్థోధనుర్ధరః।
తత్రశ్రీర్విజయోభూతి, ర్ధ్రువానీతిర్మతిర్మమ॥

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తోమాం, యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమంవహామ్యహం॥

శ్లో॥ స్మృతే సకలకల్యాణ, భాజనం యత్రజాయతే।
పురుషస్త మజం నిత్యం, వ్రజామి, శరణం హరిమ్॥

శ్లో॥ సర్వదా సర్వకార్యేషు, నాస్తితేషామ మఙ్గలమ్
యేషాం హృదిస్థో-భగవాన్, మఙ్గళాయతనం, హరిః॥

శ్లో॥ లాభస్తేషాం, జయస్తేషాం, కుతస్తేషాం పరాభవః।
యేషామిన్దీవరశ్యామో, హృదయస్థో, జనార్దనః॥

శ్లో॥ ఆపదామపహర్తారం, దాతారం సర్వసమ్పదామ్।
లోకాభిరామం, శ్రీరామం, భూయో, భూయో
నమామ్యహం॥

శ్లో॥ సర్వమంగళ మాంగళ్యే, శివే సర్వార్థసాధకే।
శరణ్యే త్ర్యంబకేదేవి, నారాయణి నమోస్తుతే॥

అని అక్షతలు స్వామిపై నుంచవలెను.

## —♦ కలశపూజ ♦—

తదంగం కలశపూజాం కరిష్యే

అని కలశమునకు గంధము కుంకుమతో మూడుబొట్లుపెట్టి కలశము లో తమలపాకు లేక పుష్పముంచి కుడిహస్తమును కలశముమీద పెట్టి యీ శ్లోకములు పఠించవలెను.

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః, కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలేతత్రస్థితో బ్రహ్మా, మధ్యేమాతృగణా స్మృతాః॥

శ్లో॥ కుక్షౌతు సాగరాస్సర్వే, సప్తద్వీపావసుంధరా
ఋగ్వేదోఽథ యజుర్వేద, స్సామవేదోహ్యథర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే, కలశాంబు సమాశ్రితాః।
ఆయాంతు. శ్రీమహాగణపతి పూజార్థం, మమదురితక్షయ
కారకాః । కలశోదకేన పూజాద్రవ్యాణి, దేవమణ్టపమా
త్మానమ్ సంప్రోక్ష్య॥

అని కలశమందలి జలమును పుష్పముతో పూజచేయు వస్తువుల మీదను దేవునిమీదను తనమీదను చల్లుకోవలయును.

## ప్రాణప్రతిష్ట.

మంత్రము॥ ఓం అసునీతే పునరస్మాసు, చక్షుః పునః ప్రాణ
మిహనోధేహి భోగమ్, జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరన్త
మనుమతే, మృళయానస్స్వస్తి, అమృతం వై ప్రాణా అమృత
మాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వయతే।

యీమంత్రము ఉచ్చరించునపుడు తమలపాకును స్వామిపైనుంచి తాకవలయును.

| | | |
|---|---|---|
| మహాగణాధిపతయేనమః | ధ్యాయామి | అక్షతలు చల్లవలెను. |
| ,, | ఆవాహయామి | |
| ,, | ఆసనం సమర్పయామి | |

| | |
|---|---|
| పాదయోః-పాద్యం సమర్పయామి. | కలశములో నీళ్ళు చల్లవలెను. |
| హస్తయోః-అర్ఘ్యం సమర్పయామి | ,, |
| ముఖే-ఆచమనీయం సమర్పయామి | ,, |
| శుద్ధోదకస్నానం సమర్పయామి. | ,, |

స్నానానంతరం ఆచమనీయం సమర్పయామి.

పళ్లెంలో నీళ్ళు వదలవలెను.

వస్త్రం సమర్పయామి. పసుపుకుంకుమతో కలిపినవత్తిపత్తినుంచవలెను.

యజ్ఞోపవీతం సమర్పయామి.

యజ్ఞోపవీతము యివ్వవలెను లేనిచో అక్షతలు వుంచవలెను.

శ్రీగంధాం ధారయామి- అని గంధం వుంచవలెను.

గంధస్యోపరి అలంకరణార్థం అక్షతాం సమర్పయామి.

అని అక్షతలు వుంచవలెను.

పుష్పైః పూజయామి అని పుష్పముల పూజించవలెను.

ఓం సుముఖాయనమః, ఓం ఏకదంతాయనమః, ఓం కపిలాయనమః, ఓం గజకర్ణికాయనమః, ఓం లంబోదరాయనమః, ఓం వికటాయనమః, ఓం విఘ్నరాజాయనమః, ఓం గణాధిపాయనమః, ఓం ధూమకేతువేనమః, ఓం గణాధ్యక్షాయనమః, ఓం ఫాలచంద్రాయనమః, ఓం గజాననాయనమః; ఓం వక్రతుండాయనమః, ఓం శూర్పకర్ణాయనమః ఓం హేరంబాయనమః, ఓం స్కందపూర్వజాయనమః, ఓం మహాగణాధిపతయేనమః. నానావిధ పరిమళపత్ర పుష్పాణి సమర్పయామి అని పూజ పూర్తికావలెను.

| | |
|---|---|
| ధూపమాఘ్రాపయామి | ధూపము యివ్వవలెను. |
| దీపం దర్శయామి | దీపము ,, |

నైవేద్యం:—'పండుగాని బెల్లముగాని వుంచి యీ క్రిందిమంత్రముతో ప్రోక్షించి నివేదన చేయవలెను.

మంత్రమ్॥ఓంభూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్॥

దేవసవితః ప్రసువ, సత్యంత్వర్తేన పరిషించామి,

అని నీళ్ళు చుట్టూ త్రిప్పవలెను.

అమృతమస్తు, అని నీళ్ళు పళ్ళెరములో వదలవలయును.

అమృతోపస్తరణమసిస్వాహా, అని చెప్పవలెను.

ఓం ప్రాణాయస్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం ఉదానాయస్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం మహాగణాధిపతయేనమః॥

నివేదయామి, అని నైవేద్యద్రవ్యమును స్వామికి నివేదన చూపవలయును.

మధ్యేమధ్యే పానీయం సమర్పయామి, అమృతాపిధానమసి, ఉత్తరాపోశనం సమర్పయామి,

హస్తప్రక్షాళనం సమర్పయామి-

పాదప్రక్షాళనం ,,

శుద్ధాచమనీయం ,,

అని ప్రతిమంత్రమునకు నీళ్ళు విడువవలయును.

గణాధిపతయేనమః దక్షిణసహిత తాంబూలంసమర్పయామి॥

అని తాంబూలం వుంచవలెను.

,, నీరాంజనం సమర్పయామి

కర్పూరహారతి యివ్వవలెను.

,, ఆచమనీయం సమర్పయామి,

ఉదకం వుంచవలెను

## —♦ మంత్రపుష్పం ♦—

వక్రతుండ మహాకాయ, సూర్యకోటి సమప్రభ
అవిఘ్నం కురుమేదేవ, సర్వకార్యేషు సర్వదా॥
మహాగణాధిపతయే నమః మంత్రపుష్పం
సమర్పయామి. అని పువ్వులు కానుకలు అక్షింతలు,
స్వామివద్ద వుంచవలెను.

ఆత్మప్రదక్షిణ నమస్కారం సమర్పయామి,
సర్వోపచార పూజాం సమర్పయామి॥
అని అక్షతలు వుంచవలెను.

క్షమార్పణ.

యస్యస్మృత్యాచ నామోక్త్యా, తపః పూజా క్రియా క్రియాసు, న్యూనం సంపూర్ణతాం, యాతి, సద్యోవందే తము చ్యుతం మంత్రహీనం, క్రియాహీనం, భక్తిహీనం గణాధిప, యత్పూజితం, మయాదేవ, పరిపూర్ణం, తదస్తుతే॥

అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్సర్వాత్మక శ్రీమహాగణాధిపతిస్సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే శుభకర్మణ్య నిర్విఘ్నమస్త్వి తిభవంతో బ్రువంతు॥ ఉత్తరే శుభకర్మణ్య నిర్విఘ్నమస్తు॥

శ్రీమహాగణాధిపతి ప్రసాదం మమ శిరసాగృహ్ణామి.
అని అక్షతలు శిరస్సున నుంచుకోవలెను.

శ్రీమహా గణాధిపతిం ఉద్వాసయామి,
అని ఆరును జరపవలెను.



# వరసిద్ధివినాయకుని పూజ.

ఆచమనము. కేశవాయస్వాహా.........శ్రీకృష్ణాయనమః,
అని ఆచమనముచేసి స్మరించవలయును.

## ప్రణవోచ్చారణగ.

ఓం దైవీగాయత్రీ ఛన్దః, ప్రాణాయామే వినియోగః

అని కుడిముక్కుతో వాయువును నెమ్మదిగా పీల్చి యెడమ ముక్కుతో విడువవలయును.

రెండవతూరి అట్లే యెడమముక్కుతో వాయువును పీల్చి కుడి ముక్కుతో విడువవలయును.

యీ దిగువ మంత్రము పఠించునప్పుడు నాశికమును (ముక్కు) పట్టుకొనవలయును.

మంత్రమ్॥ ఓం భూః, ఓమ్ భువః, ఓగ్ంసువః, ఓమ్ మహః, ఓమ్ జనః, ఓమ్ తపః, ఓగ్ం సత్యం, ఓమ్తత్ సవితుర్వరేణ్యం, భర్గోదేవస్య ధీమహి॥ ధియో యోనః, ప్రచోదయాత్, ఓ, మా, పోజ్యోతీ, రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్, అని ముక్కును విడవవలయును.

## మంగళాచరణమ్.

శ్రీలక్ష్మీనారాయణాభ్యాంనమః, వాణీహిరణ్యగర్భాభ్యాం నమః, ఉమామహేశ్వరాభ్యాం నమః, శచీపురందరాభ్యాం నమః, ఇంద్రాద్యష్ట దిక్పాలకదేవతాభ్యోనమః,

అరుంధతీ వసిష్ఠాభ్యాం నమః, మాతాపితృభ్యాం నమః, అగ్నయేనమః, శ్రీసీతా రామాభ్యాంనమః, సర్వేభ్యోమహాజనేభ్యోనమః, అని అక్షతలు సర్వజనులమీద చల్లి నమస్కరించవలెను.

## —♦ మహాసంకల్పమ్ ♦—

శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య, అద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే, శ్వేతవరాహకల్పే వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరోః, దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య, యీశాన్యప్రదేశే, కృష్ణ, గోదావరి యోర్మధ్యదేశే, శోభనగృహే, సమస్తదేవతా, బ్రాహ్మణ, హరిహరసన్నిధౌ, అస్మిన్ వర్తమాన, వ్యవహారిక, చాంద్రమానేన, శ్రీ ఆంగీరసనామ సంవత్సరే, దక్షిణాయనే, వర్షఋతౌ, భాద్రపద మాసే, శుక్లపక్షే, చతుర్థ్యాం భానువాసరే, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవంగుణ, విశేషణ విశిష్టాయాం, శుభతిథౌ శ్రీమాన్ ... ... ...గోత్రస్య ... ... నామధేయస్య (అని యిచ్చట తన గోత్రం పేరు చెప్పుకొనవలయును॥ (మమ) అస్మాకం సహకుటుంబానాం, క్షేమ స్థైర్య, విజయ, అభయ, ఆయురారోగ్య అయిశ్వర్యాభివృధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష, చతుర్విధ ఫలపురుషార్థ, శిధ్యర్థం, పుత్ర పౌత్రాభి, వృధ్యర్థం, ఇష్టకామ్యార్థ ఫలసిధ్యర్థం, మనోవాంఛా ఫలసిధ్యర్థం, సమస్త దురితోపద్రవశాంత్యర్థం, సమస్త మంగళావాప్త్యర్థం, వర్షేవర్షే ప్రయుక్త, వరసిద్ధివినా

యక, దేవతాముద్దిస్య, వరసిద్ధివినాయక, దేవతాప్రీత్యర్థం, కల్పోక్త ప్రకారేణ, యావచ్ఛక్తిధ్యానా, మావాహనాది, షోడశోపచార పూజాం కరిష్యే॥

అని జలమును ముట్టుకొనవలయును.

కలశపూజ.

తదంగ కలశపూజాం కరిష్యే,

అని కలశమునకు గంధము కుంకుమతో మూడు బొట్లుపెట్టి కలశములో పుష్పముంచి కుడిహస్తమును కలశమువిూదపెట్టి యీశ్లోకం పఠించవలెను.

శ్లో॥ కలశస్య ముఖేవిష్ణుః, కణ్ఠేరుద్రస్సమాశ్రితః
మూలే తత్రస్థితో బ్రహ్మ, మధ్యేమాతృగణాస్మృతాః॥
(2) కుక్షౌతు సాగరాస్సర్వే. సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోఽథయజుర్వేద, సామవేదోహ్యధర్వణః॥
(3) అఙ్గైశ్చ సహితాః స్సర్వే, కలశాంబు సమాశ్రితాః॥
(4) గంగేచ యమునే కృష్ణే. గోదావరి సరస్వతీ
నర్మదే సింధు కావేరి జలేఽస్మిన్ సన్నిధింకురు॥

మంత్రం॥ ఆకలశేషుధావతి, పవిత్రే పరిషిచ్యతే, ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే॥

మంత్రము॥ ఆపోవా ఇదగ్ం సర్వం, విశ్వాభూతాన్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపోన్నమాపోఽమృతమాపస్స మ్రాడాపో, విరాడాపస్స్వరాడా, పశ్ఛంద్గాగ్, స్యాపో

జ్యోతిగ్, షాపోయజూగ్, షాప స్సత్యమాపస్సర్వా దేవతా ఆపోభూర్భువస్సువరాప ఓం॥

ఆయాంతు శ్రీమహాగణాధిపతి పూజార్థం మమ దురితక్షయ కారకాః । కలశోదకేన పూజాద్రవ్యాణి దేవ మణ్టప మాత్మానం సంప్రోక్ష్య-

అని కలశమందలి జలమును పుష్పముతో పూజచేయు వస్తువుల మీదను, దేవునిమీదను, తనమీదను ప్రోక్షించుకొనవలెను.

## ప్రాణప్రతిష్ఠ.

తదంగత్వేన వరసిద్ధివినాయక ప్రాణప్రతిష్ఠాపనం కరిష్యే,

అని వినాయక విగ్రహమును మంటపముమీదనుంచి పుష్పముతో తాకి యీ క్రింది మంత్రములతో ప్రాణప్రతిష్ఠ చేయవలెను.

అస్య శ్రీవరసిద్ధివినాయక, దేవతా, ప్రాణప్రతిష్ఠాపన మహామంత్రస్య, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరా, ఋషయః, ఋగ్యజు, స్సామాథర్వాణి, ఛందాంసి, ప్రాణాశక్తిః. పరా దేవతా, హ్రాం, బీజం హ్రీం, శక్తిః, హ్రూం, కీలకం॥ మమ వరసిద్ధివినాయక ప్రాణప్రతిష్ఠాపన, సిద్ధ్యర్థే, జపేవిని యోగః, అని నీళ్ళు తగలవలయును.

## కరన్యాసము.

చేతులుగుర్తులు చూపవలెను.

హ్రాం అంగుష్ఠాభ్యాంనమః, బొటనవ్రేలును తర్జని (అనగా) పెద్ద వ్రేలుతో తాకవలయును.

హ్రీం తర్జనీభ్యాంనమః, బొటనవ్రేలుతో రెండవవ్రేలు తాకించ వలయును.

హ్రూం మధ్యమాభ్యాంనమః, ,, నడిమివ్రేలు తాకవలయును.

హ్రైం అనామికాభ్యాంనమః, ,, నాలుగవవ్రేలు తాకవలయును.

హ్రౌం కనిష్ఠికాభ్యాంనమః, ,, చిటికెనవ్రేలు తాకవలయును.

హ్రః కరతలకరపృష్ఠాభ్యాంనమః, రెండుచేతులు బోర్లవేసి (వేళ్ళు) తుడుచుకొనవలయును.

## అంగన్యాసము.

హ్రాం హృదయాయనమః, రొమ్మును చేతితో తాకవలయును.

హ్రీం శిరసేస్వాహా, కపాలము. ,,

హ్రూం శిఖాయైవషట్, వెనుక జుట్టుగల స్థలము ,,

హ్రైం కవచాయహుమ్, చేతులతో చెవులు తాకవలయును.

హ్రౌం నేత్రత్రయాయవౌషట్, ,, కనులు ,,

హ్రః అస్త్రాయఫట్, కుడిచేయి తన తలచుట్టు త్రిప్పి ఎడమ చేతిపై కొట్టుకొనవలయును.

(మం) భూర్భువస్సువరోం, మితి దిగ్బన్ధః, సిరస్సుచుట్టును చిటికెలు వేయవలయును.

## ధ్యానం.

శ్లో॥ రక్తామ్భోధి, స్థపోతోల్లసదరుణ సరోజాధి రూఢా
కరాబ్జైః । పాశం కోదణ్డమిక్షూ, ద్భవమణిగణ మప్య

ఙ్కుశం శఙ్ఖ్బాణాం । భి బ్రాణా సృక్కపాలం త్రిన యనలసితా పీన వక్షోరు హాధ్యా । దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరాన్నః॥

అని ధ్యానించవలయును.

హాం, హీం, క్రోం, యరలవశషస, హాోమ్. ఓం వరసిద్ధి వినాయక ప్రాణ మమప్రాణ వర సిద్ధివినాయకజీవ మమ జీవ వాఙ్మనశ్చక్షుః శ్రోత్రి జిహ్వా ఘ్రాణైః ఉచ్ఛ్వాస నిశ్వాస రూపేణ బహిరాగత్య అస్మిన్ బింబే అస్మిన్ కలశే సుఖేన చరన్తిష్ఠంతుస్వాహా॥

అని ప్రతిమను తనను స్పృశించుకోవలయును.

మంత్రము॥ ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణ మిహనోధేహి భోగమ్ జ్యోక్పశ్యేమ సూర్యముచ్చరన్త మనుమతే మృళయానస్స్వస్తి అమృతంవై ప్రాణా అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే॥

మంత్రము॥ గణానాం త్వాగణపతిగ్ం హవామహే కవీం కవీ నాముప మశ్రవస్తమం, జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మ ణస్పత అనశ్శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్॥

అమృతంవయి, ప్రాణామృతమాపః, ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే, అవ హితోభవ, స్థాపితోభవ, సుప్రసన్నోభవ, అవకుంఠితోభవ, వరదోభవ, ప్రసీదప్రసీద ప్రసీద॥

మంత్రము॥ ఆత్మావహస్తు హారయస్నచేతసశ్శైవ తైరశ్శైవ స్సహా కేతుమద్భిః వాతాజనైర్బలవద్భిర్మనోజవై రాయాహి శీఘ్రం మమ హవ్యాయశర్వోమ్॥

ఈ మంత్రము చెప్పి అక్షతలు పుష్పములు తీసికొని ప్రతిమ శిరస్సున నుంచవలెను.

యత్కించి నివేదనం కుర్యాత్.

అని ఆవసర నివేదనము 7 వ పేజీలో చూపిన మంత్రంతోటి నివేదన చేయవలెను.

—— పూజాప్రారంభః. ——

శ్లో॥ భవసంచితపాపౌఘ, విధ్వంసన, విచక్షణమ్, విఘ్నాంధకార భాస్వంతం, విఘ్నరాజ మహంభజే॥ ఏకదంతం శూర్పకర్ణం, గజవక్త్రం, చతుర్భుజమ్, పాశాంకుశ ధరన్దేవం, ధ్యాయేత్సిద్ధివినాయకం ఉత్తమం, గణనాధస్య సర్వసంపత్కరం శుభం, భక్తాభీష్టప్రదంతస్మా, ధ్యాయేత్తం, విఘ్ననాయకమ్॥ ధ్యాయేద్గజాననం, దేవం తప్త కాంచన సన్నిభమ్, చతుర్భుజం మహాకాయం, సర్వాభరణ భూషితమ్॥

శ్రీమహా వరసిద్ధివినాయకస్వామినేనమః, ధ్యాయామి,

అని పుష్పం దేవునియందుంచవలెను.

శ్లో॥ అత్రాగచ్ఛ జగద్వంద్య, సురరాజార్చితేశ్వర।
అనాధనాధ సర్వజ్ఞ గౌరీగర్భ సముద్భవ॥

శ్రీవర ... నమః ఆవాహయామి, అని పుష్పం వుంచవలెను.

శ్లో॥ మౌక్తికైః, పుష్యరాగైశ్చ, నానారత్న విరాజితమ్
రత్నసింహాసనం, చారు ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్॥

శ్రీవర ... నమః ఆసనం సమర్పయామి, అని పుష్పం వుంచవలెను.

శ్లో॥ గౌరీపుత్ర నమస్తేస్తు, శంకర ప్రియనందన।
గృహాణార్ఘ్యం, మయాదత్తం, గంధపుష్పాక్షతైర్యుతం॥

శ్రీవర ... నమః అర్ఘ్యం సమర్పయామి,
అని నీళ్ళు వదలవలయును.

శ్లో॥ గజవక్త్ర నమస్తేస్తు, సర్వాభీష్ట ప్రదాయక।
భక్త్యాపాద్యం మయాదత్తం, గృహాణ ద్విరదానన॥

శ్రీవర ... నమః పాద్యం సమర్పయామి, అని నీళ్లు వదలవలయును.

శ్లో॥ అనాథనాథ సర్వజ్ఞ, గీర్వాణ వరపూజిత।
గృహాణాచమనం దేవ, తుభ్యం దత్తం మయాప్రభో॥

శ్రీవర ... నమః ఆచమనీయం సమర్పయామి,
అని నీళ్ళు వదలవలయును.

మం॥ ఆవహన్తీ వితన్వానా, కుర్వాణా చీరమాత్మనః।
వాసాగ్ం సిమమగావశ్చ, అన్నపానేచ సర్వదా।
తతోమేశ్రియ మావహ, లోమశాం పశుభిసహస్వాహా॥

శ్రీవర ... నమః, మధుపర్కం సమర్పయామి,
అని పసుపుతో కలిపిన దూది వుంచవలెను.

మంత్రము॥ యాఃఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చపుష్పిణీః
బృహస్పతిప్రసూతాస్తానో ముఞ్చన్త్వగ్ంహసః॥

శ్రీవరసిద్ధి వినాయక స్వామినేనమః ఫలోదకం సమర్పయామి,

అని ఫలోదకములు స్నానముగా చల్లవలెను.

శ్లో॥ దధిక్షీర సమాయుక్తం మధ్వాజ్యేన సమన్వితమ్
మధుపర్కం గృహాణేదం గజవక్త్ర నమోఽస్తుతే.

శ్లో॥ స్నానం పంచామృతైర్దేవ, గృహాణగణనాయక
అనాధనాధ సర్వజ్ఞ గీర్వాణగణపూజిత॥

శ్రీవరసిద్ధివినాయక స్వామినేనమః, పంచామృత స్నానం సమర్పయామి.

అని పంచామృతములు స్నానము చేయించవలెను.

మం॥ ఆపోహిష్ఠా మయోభువః తానఊర్జే దధాతన, మహేరణాయచక్షసే యోవశ్శివతమోరసః, తస్యభాజయతేహనః।ఉశతీరివమాతరః। తస్మా అరంగమామవః,'యస్య క్షయాయజిన్వథ'। ఆపోజన యథాచనః॥

శ్లో॥ గంగాది సరస్వతీర్ధేభ్య, ఆహ్వైతైరమలైర్జలైః।
స్నానంకురుష్వభగవన్నుమాపుత్ర నమోస్తుఽతే॥

శ్రీవర ... నమః. శుద్ధోదకస్నానంసమర్పయామి.

అని నీళ్ళు చల్లవలయును.

మంత్రము॥ అభివస్త్రాసువసనాన్యర్షాభిధేనూ స్సుదుఘాః పూయమానః। అభిచన్ద్రా భర్తవేనో, హిరణ్యాభ్యశ్వాన్ రథినోదేవసోమ.

శ్లో॥ రక్తవస్త్రద్వయం చారు, దేవయోగ్యంచ మంగళం।
శుభప్రదం గృహాణత్వమ్, లంబోదరహరాత్మజ।

శ్రీవరసిద్ధి వినాయకస్వామినేనమః వస్త్రయుగ్మంసమర్పయామి

అని వస్త్రము లేక వత్తిపత్తి యివ్వవలయును.

మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ । ఆయుష్యమగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః

శ్లో॥ రాజితం బ్రహ్మసూత్రంచ । కాంచనంచోత్తరీయకమ్।
గృహాణ దేవసర్వజ్ఞ । భక్తానామిష్టదాయక॥

శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే నమః ఉపవీతం సమర్పయామి
అని యజ్ఞోపవీతమును వుంచవలెను.

మంత్రము॥ గంధద్వారాం దురాధర్షాం, నిత్యపుష్టాంకరీషిణీం'
ఈశ్వరీగ్ం, సర్వభూతానాం, తామిహోపహ్వయే శ్రియమ్॥

శ్లో॥ శ్రీగంధం చందనోన్మిశ్రం, కర్పూరేణ సుసంయుతం
విలేపనం సురశ్రేష్ట, ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం॥

శ్రీ వరసిద్ధివినాయకస్వామినే నమః గంధాన్ సమర్పయామి,
అని గంధమును స్వామికి విలేపన చేయవలెను.

మంత్రము॥ ఆయనే తే పరాయణే దూర్వారోహన్తు పుష్పిణీః
హ్రదాశ్చ పుణ్డరీకాణి, సముద్రస్య గృహాఇమే॥

శ్లో॥ అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ । శాలీయాం తండులాం
శుభాన్। గృహాణ పరమానంద। ఈశపుత్ర నమోస్తుతే॥

శ్రీ వరసిద్ధి వినాయకస్వామినే అక్షతాన్ సమర్పయామి,
అని అక్షతలు వుంచవలెను.

శ్లో॥ సుగంధీని సుపుష్పాణి, జాతీకుందముఖానిచ ।
ఏకవింశతి పత్రాణి, సంగృహాణ నమోస్తుతే॥

శ్రీ వర... నమః పుష్పాణి పూజాయామి,
అని నానావిధ పుష్పములను పూజచేయవలయును.

## అథాంగపూజ.

ఓం గణేశాయనమః పాదౌ పూజయామి (పాదములు)
ఓం ఏకదంతాయనమః గుల్ఫౌ ... (మడిమలు)
ఓం శూర్పకర్ణాయనమః జానునీ ... (మోకాళ్లు)
విఘ్నరాజాయనమః జంఘే ... (పిక్కలు)
ఆఖువాహనాయనమః ఊరూ ... (తొడలు)
హేరమ్బాయనమః కటిం ... (పిఱుందు)
లంబోదరాయనమః ఉదరం ... (బొజ్జ)
గణనాథాయనమః నాభిం ... (పొక్కిలి)
గణేశాయనమః హృదయం ... (ఱొమ్ము)
స్థూలకర్ణాయనమః కంఠం ... (కంఠము)
స్కందాగ్రజాయనమః స్కందౌ ... (మూపులు)
పాశహస్తాయనమః హస్తౌ ... (చేతులు)
గజవక్త్రాయనమః వక్త్రం ... (ముఖము)
విఘ్నహన్త్రేనమః నేత్రే ... (కన్నులు)
శూర్పకర్ణాయనమః కర్ణౌ ... (చెవులు)
ఫాలచంద్రాయనమః లలాటం ... (నొసలు)
సర్వేశ్వరాయనమః శిరః ... (తల)
విఘ్న రాజాయనమః సర్వాంగాని పూజయామి
అని (అన్ని యంగములు) పూజచేయవలెను.

## అథైకవింశతి పత్రపూజా.

21 ఆకులతో జేయుపూజ.

౧ ఓం సుముఖాయనమః మాచీపత్రం పూజయామి (మాచిపత్రి)
౨ ఓం గణాధిపాయనమః బృహతీపత్రం ... (వాకుడాకు)

3 ఉమాధిపాయనమః, బిల్వపత్రంపూజయామి (మారేడు)
౪ గజాననాయనమః, దూర్వాయుగ్మం ... (గరిక)
౫ హరసూనవేనమః, దత్తూరపత్రం ... (ఉమ్మెత్త)
౬ లంబోదరాయనమః, బదరీపత్రం ... (రేగుఆకు)
౭ గుహాగ్రజాయనమః, అపామార్గమాపత్రం ... (ఉత్తరేణి)
౮ గజకర్ణాయనమః, తులసీపత్రం ... (తులసీ)
౯ ఏకదంతాయనమః, చూతపత్రం ... (మామిడాకు)
౧౦ వికటాయనమః, కరవీరపత్రం ... (గన్నేరు)
౧౧ భిన్నదన్తాయనమః, విష్ణుక్రాన్తపత్రం ... (విష్ణుక్రాంతము
౧౨ వటవేనమః, దాడిమీపత్రం ... (దానిమ్మాకు)
౧3 సర్వేశ్వరాయనమః, దేవదారుపత్రం ... (దేవదారిఆకు)
౧౪ ఫాలచన్ద్రాయనమః, మరువకపత్రం ... (మరువము)
౧౫ హేరమ్బాయనమః, సిన్ధువారపత్రం ... (వావిలాకు)
౧౬ శూర్పకర్ణాయనమః, జాతీపత్రం ... (జాజిఆకు)
౧౭ సురాగ్రజాయనమః, గణకీపత్రం ... (అడవిమొల్ల)
౧౮ ఇభవక్త్రాయనమః, శమీపత్రం ... (జమ్మిపత్రి)
౧౯ వినాయకాయనమః, అశ్వత్థపత్రం ... (రావిపత్రి)
౨౦ సురసేవితాయనమః, అర్జునపత్రం ... (మద్దిఆకు)
౨౧ కపిలాయనమః, అర్కపత్రం ... (జిల్లేడాకు)

శ్రీవిఘ్నేశ్వరాయనమః ఏకవింశతి పత్రాణి పూజయామి.

అని 21 పత్రములు పూజ పూర్తికావలెను.

## అష్టోత్తర శతనామావళిః పూజ.

పుష్పములతో కాని బియ్యపు అక్షతలతోగాని 108 సార్లు ప్రతినామముకు మొదట ఓం. అనియు చివర, నమః అనియు పలుకుతూ పూజించవలయును.

---

ఓంగజాననాయనమః
గణాధ్యక్షాయనమః
విఘ్నరాజాయ
వినాయకాయ
ద్వైమాతురాయ
ద్విముఖాయ
ప్రముఖాయ
సుముఖాయ
కృతినే
సుప్రదీపాయ 10
సుఖనిధయే
సురాధ్యక్షాయ
సురారిఘ్నాయ
మహాగణపతయే
మాన్యాయ
మహాకాలాయ
మహాబలాయ
హేరమ్బాయ
లమ్బజఠరాయ
హ్రస్వగ్రీవాయ 20
మహోదరాయ
మదోత్కటాయ
మహావీరాయ
మన్త్రిణే
మఙ్గళస్వరాయ
ప్రమథాయ
ప్రథమాయ
ప్రాజ్ఞాయ
విఘ్నకర్త్రే
విఘ్నహన్త్రే 30
విశ్వనేత్రే
విరాట్పతయే
శ్రీపతయే
వాక్పతయే
శృంగారిణే
ఆశ్రితవత్సలాయ
శివప్రియాయ
శీఘ్రకారిణే
శాశ్వతాయ
బలాయ 40
బలోత్థితాయ
భవాత్మజాయ
పురాణపురుషాయ
పూష్ణే
పుష్కరోత్క్షిప్తవారిణే
అగ్రగణ్యాయ
అగ్రపూజాయ
అగ్రగామినే
మన్త్రికృతే
చామీకరప్రభాయ
సర్వస్మై [50

సర్వోపాస్యాయ
సర్వకర్త్రే
సర్వనేత్రే
సర్వసిద్ధిప్రదాయ
సర్వసిద్ధయే
పఞ్చహస్తాయై
పార్వతీనన్దనాయ
ప్రభవే
కుమారగురవే 60
అక్షోభ్యాయ [య
కుంజరాసురభంజనా
ప్రమోదాత్తాయ
మోదకప్రియాయ
కాన్తిమతే
ధృతిమతే
కామినే [య
కపిత్థపనసప్రియా
బ్రహ్మచారిణే
బ్రహ్మరూపిణే 70
బ్రహ్మవిద్యాదిదాన
జిష్ణవే భువే

విష్ణుప్రియాయ
భక్తజీవితాయ
జితమన్మథాయ
ఐశ్వర్యకారణాయ
జ్యాయసే [యై
యక్షకిన్నరసేవితా
గంగాసుతాయ
గణాధీశాయ 80
గమ్భీరనినదాయ
వటవే
అభీష్టవరదాయ
జ్యోతిషే
భక్తనిధయే
భావగమ్యాయ
మఙ్గళప్రదాయ
అవ్యక్తాయ [మాయ
అప్రాకృతపరాక్ర
సత్యధర్మిణే 90
సఖ్యే
సరసామ్బునిధయే
మహేశాయ

దివ్యాంగాయ [య
మణికింకిణీమేఖలా
సమస్తదేవతామూ
సహిష్ణవే [ర్తయే
సతతోత్థితాయ
విఘాతకారిణే
విశ్వగ్దృశే 100
విశ్వరక్షాకృతే
కల్యాణగురవే
ఉన్మత్తవేషాయ
అపరజజితే
సమస్తజగదాధా
[రాయ
సర్వైశ్వర్యప్రదా
య
ఆక్రాంత చిదచిత్ప్ర
భవే
శ్రీవిఘ్నేశ్వరాయ
నమః 108

వరసిద్ధివినాయక స్వామినేనమః అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి, అని పూజ పూర్తిచేయవలెను.

షరా:—వారివారి శక్తికొలది సహస్రనామ పూజకూడ చేయవచ్చును.

యీ మంత్రం ఉచ్చరించుచూ ధూపము వేయవలెను.

మంత్రము॥ ధూరసి ధూర్వ ధూర్వన్తం ధూర్వతం
యోఽస్మాన్ ధూర్వతితంధూర్వయంవయంధూర్వామః॥

శ్లో॥ దశాఙ్గం గుగ్గులోపేతం, సుగంధంచ, మనోహరం।
ఉమాసుతనమస్తుభ్యం, గృహాణ వరదోభవ॥

శ్రీవరసిద్ధివినాయకాయనమః, ధూపమాఘ్రాపయామి.
అని ధూపము వేయవలెను.

మంత్రము॥ ఉద్దీప్యస్వజాతవేదోపఘ్నం నిఋుతింమమ।
పశూగ్శ్చ మహ్యమావహజీవనంచ దిశోదశ।
మానోహింగ్ం సీజ్జాతవేదోగామశ్వం పురుషం జగత్।
అభిభ్రదఘ్న ఆగహిశ్రియామా పరిపాతయ॥

శ్లో॥ సాజ్యం త్రివర్తిసంయుక్తం, వహ్నినాద్యోతితం, మయా।
గృహాణ మంగళం దేవ, ఈశపుత్ర నమోస్తుతే॥

శ్రీవరసిద్ధివినాయకాయనమః, దీపం దర్శయామి,
అని త్రివర్తిదీపమును అనగా త్రైవత్తులు వెలిగించవలెను.

ధూపదీపానంతర మాచమనీయం సమర్పయామి,
అని ఉదకము వదలవలయును.

శ్లో॥ సుగంధాం సుకృతాంశ్చైవ, మోదకాన్ ఘృతపాచి
తాన్। నైవేద్యం గృహ్యతాం దేవ, చణముద్గైః
ప్రకల్పితాన్॥

శ్లో॥ భక్ష్యం భోజ్యంచ లేహ్యంచ, చోష్యం పానీయమేవచ।
ఇదంగృహాణ నైవేద్యం, మయాదత్తం వినాయకా॥

శ్రీవరసిద్ధి వినాయకాయనమః, నైవేద్యం సమర్పయామి,

అని మహానైవేద్యమును పే 7 జి లో చెప్పినప్రకారం ఆపోశన మంత్రముతో నివేదన చేయవలెను.

శ్లో॥ పూగీఫల సమాయుక్తం, నాగవల్లీ దళైర్యుతమ్ ।
కర్పూరచూర్ణసంయుక్తం,తాంబూలం ప్రతిగృహ్యతాం॥

శ్రీవరసిద్ధివినాయకాయనమః, తాంబూలం సమర్పయామి,

అని తాంబూలం యివ్వవలెను.

నీరాంజనమ్.

మం॥ హిరణ్యపాత్రం మధోఃపూర్ణం దధాతి మధవ్యోపానీతి ఏకధా బ్రహ్మణఉపహారతి ఏకధైవయజమాన ఆయుస్తేజోదధాతి॥

శ్లో॥ ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూరశకలైస్తథా
నీరాంజనం మయాదత్తం గృహాణవరదోభవ॥

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనె
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళం॥

శ్రీవర సిద్ధివినా......నమః నీరాజనం సమర్పయామి

అని కర్పూరహారతి యివ్వవలెను.

## అథ దూర్వాయుగ్మ (గరికపోచలు) పూజా.

గణాధిపాయనమః దూర్వాయుగ్మం పూజయామి
ఉమాపుత్రాయనమః ,,
ఆఖువాహనాయనమః ,,
వినాయకాయనమః ,,
ఈశపుత్రాయనమః ,,
సర్వసిద్ధిప్రదాయకాయనమః ,,
ఏకదంతాయనమః ,,
ఇభవక్త్రాయనమః ,,
మూషకవాహనాయనమః ,,
కుమారగురవేనమః దూర్వాయుగ్మం పూజయామి-

అని గరికతో పూజ పూర్తికావలెను.

ష రా:—యీగరికెపూజ 28 పేజిలో తెల్పిన ప్రదక్షిణ నమస్కారము లనంతరం చేయవలెను.

### —♦ మంత్రపుష్పము. ♦—

ఓం ధాతా పురస్తాద్య ముదాజహార,
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః,
తమేవం విద్వా నమృత ఇహాభవతి,
నాన్యః పంథా అయనాయ విద్యతే॥
సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం,
విశ్వం నారాయణం, దేవ, మక్షరం, పరమం పదం॥
విశ్వతః, పరమాన్నిత్యం, విశ్వం నారాయణగ్ం, హరిం,
విశ్వమేవేదం, పురుష,_స్త, ద్విశ్వ, ముపజీవతి॥

పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం, శాశ్వతగ్ం, శివమచ్యుతం,
నారాయణం, మహాజ్ఞేయం,విశ్వాత్మానం, పరాయణం॥

నారాయణ, పరోజ్యోతిరాత్మా, నారాయణః, పరః
నారాయణ, పరం, బ్రహ్మ, తత్వం నారాయణః,పరః॥
నారాయణ, పరోధ్యాతా, ధ్యానం నారాయణః పరః॥

యచ్చకించి, జగత్సర్వం, దృశ్యతే, శ్రూయతేఽపివా,
అన్తర్బహిశ్చ, తత్సర్వం, వ్యాప్య, నారాయణ, స్థితః,॥

అనన్త, మవ్యయం, కవిగ్ం, సముద్రేన్తం, విశ్వశంభువం,
పద్మకోశ, ప్రతీకాశగ్ం, హృదయం; చాప్యధోముఖం॥

అధో, నిష్ట్యా, వితస్త్యాన్తే, నాభ్యా, ముపరి, తిష్ఠతి,
జ్వాలమాలాకులం, భాతి, విశ్వస్యాఽయతనం, మహత్॥

సన్తతగ్ం, శిలాభిస్తు, లంబత్యా కోశసన్నిభం,
తస్యాన్తే,సుషిరగ్ం, సూక్ష్మం, తస్మింత్సర్వం,ప్రతిష్ఠితం॥

తస్యమధ్యే మహానగ్ని, ర్విశ్వార్చి, ర్విశ్వతో, ముఖః,
సోఽగ్రభు, గ్విభజ, న్తిష్ఠన్నాహార, మజరః, కవిః,
తిర్యగూర్ధ్వ, మధశ్శాయీ, రశ్మయస్తస్యసంతతా॥

సన్తాపయతి, స్వం, దేహ, మాపాద, తల, మస్తకః,
తస్య, మధ్యే, వహ్ని, శిఖా, అణీ,యోర్ధ్వా,వ్యవస్థితః॥

నీలతోయద మధ్యస్థా, ద్వి, ద్యు, ల్లేఖే, వ, భాస్వరా,
నీవారశూకవత్తన్వీ, పీతా భాస్వ, త్యణూపమా॥

తస్యాశ్శిఖాయా, మధ్యే, పరమాత్మా, వ్యవస్థితః,
సబ్రహ్మ సశివస్స హరిస్సేంద్రసోఽక్షరః పరమస్స్వరాట్॥

రాజాధిరాజాయ, ప్రసహ్యసాహినే, నమోవయంవై,
శ్రవణా, యకుర్మహే, సమేకామాన్, కామకామాయ
మహ్యం, కామేశ్వ, రోవై, శ్రవణో,దదాతు కుబేరా
యవై శ్రవణాయ, మహారాజాయనమః॥

ఓం తద్బ్రహ్మ, ఓం తద్వాయుః, ఓం తదాత్మా,
ఓం తత్సత్యం, ఓం తత్సర్వం, ఓం తత్పురోంనమః॥

అన్తశ్చరతి, భూతేషు, గుహాయాం,విశ్వమూర్తిషు,త్వం
యజ్ఞస్త్వం వషట్కారస్త్వ, మిన్ద్రస్త్వగ్ం,రుద్రస్త్వం,
విష్ణుస్త్వం బ్రహ్మత్వం, ప్రజాపతిః॥
త్వం, తదాప, ఆపో, జ్యోతీ, రసోమృతం; బ్రహ్మ,
భూర్భువస్సువరోం॥

...............

* ఈశానస్సర్వ విద్యానా, మీశ్వరస్సర్వ భూతానాం
బ్రహ్మాధిపతిర్, బ్రహ్మణోధిపతిర్, బ్రహ్మా, శివో
మే, అస్తు, సదాశివోం,॥......

శ్రీవర.........నమః సువర్ణ దివ్యమంత్రపుష్పం సమర్పయామి.

---

అని అక్షతలు పుష్పములు కానుకలుంచవలెను.

మరా:—మంత్రపుష్పము పూర్తిగా చదువుటకు వ్యవధిచాలని యెడల
* గుర్తుగల మంత్రము మాత్రం చెప్పుకొనవచ్చును.

## ప్రదక్షిణము.

శ్లో॥ యానికానిచ పాపాని, జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యన్తి ప్రదక్షిణ పదేపదే॥

శ్లో॥ పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమామ్ కృపయాదేవ శరణాగతవత్సల ॥

శ్లో॥ అన్యథా శరణంనాస్తి త్వమేవ శరణంమమ
తస్మాత్కారుణ్య భావేన రక్షరక్షగజానన॥

శ్లో॥ ప్రదక్షిణం కరిష్యామి సతతం మోదకప్రియ
నమస్తే విఘ్నరాజాయ నమస్తే విఘ్ననాశన॥
ప్రదక్షిణ నమస్కారాం సమర్పయామి-

అని ముమ్మారు ఆత్మప్రదక్షిణ నమస్కారము చేసి అక్షతలు నీళ్ళు వదిలిపెట్టి అక్షతలు శిరస్సున నుంచుకోవలెను.

షరా— 25 పేజీలో తెల్పిన గరికెపూజ యిచ్చట చేయవలెను. తదుపరి యీదిగువ తెల్పిన అర్ఘ్యం యివ్వవలెను.

శ్లో॥ అర్ఘ్యం గృహాణ హేరంబ। సర్వభద్రప్రదాయక
గంధపుష్పాక్షతైర్యుక్తం। పాత్రస్థం పాపనాశనమ్॥

శ్రీవర...నమః అర్ఘ్యం సమర్పయామి-

ఇట్లు 3 పర్యాయములకు తక్కువ లేకుండా యీ శ్లోకమును చెప్పి అక్షతలు నీళ్ళు పళ్లెరములో వదలవలెను

శ్లో॥ యంబ్రహ్మవేదాంత విదోవదంతి పరంప్రధానం పురుషోత్తథాన్యే, విశ్వోద్గతేః కారణమీశ్వరంవా తస్మై నమో విఘ్నవినాయకాయ॥

శ్లో॥ నమస్తుభ్యం గణేశాయ। నమస్తే విఘ్ననాయక
ఈప్సితంమేవరం దేహి। పరత్ర చపరాంగతిం॥

శ్లో॥ వినాయక నమస్తుభ్యం। సతతం మోదకప్రియ
నిర్విఘ్నం కురుమేదేవ। సర్వకార్యేషు సర్వదా॥

అని వినాయకుని ప్రార్థన నమస్కారము చేయవలెను.

## వాయనదానము.

వాయనదానం ఇచ్చేటప్పుడు యీ క్రింది శ్లోకము నుచ్చరించవలెను

శ్లో॥ గణేశః ప్రతిగృహ్ణాతు। గణేశో వైదదాతిచ
గణేశస్తారకోద్వాభ్యాం। గణేశాయ నమోనమః॥

యీ వాక్యమును చెప్పి వాయనదానం ఇవ్వవలెను.

కుడుములు, వుండ్రాళ్ళు, 16 లేక 21 యివ్వవలయును.

## ప్రతిగృహీతమంత్రమ్. (పుచ్చుకునేవారు.)

మం॥ దేవస్యత్వా సపితుః ప్రసవే। అశ్వినోర్బాహుభ్యాం
పూష్ణో హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి॥

అని వాయనము పుచ్చుకొనువారు చెప్పవలెను.

## ప్రతిమా దానమంత్రం.

శ్లో॥ వినాయకస్య ప్రతిమాం వస్త్రయుగ్మ సమన్వితాం
తుభ్యందాస్యామిదేవేశ యధోక్త ఫలదోభవ॥

అని ప్రతిమా దానం ఆచార్యునికి యివ్వవలెను.

ఈదానము ఉద్యాపన చేసినతరువాత బియ్యం వస్త్రం మొదలగు
నవి యివ్వవలయును.

## క్షమార్పణ.

యస్యస్మృత్యాచనామోక్త్యా, తపఃపూజా క్రియా దిషు న్యూనం సంపూర్ణతాం, యాతి, సద్యోవందే గణాధిప. మంత్రహీనం, క్రియాహీనం, భక్తిహీనం గణాధిపం యత్పూజితం, మయాదేవ, పరిపూర్ణం తదస్తుతే॥

శ్లో॥ అన్యథా శరణంనాస్తి, త్వమేవ శరణంమమ ।
తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష వినాయక॥

అనయాధ్యాన మావాహనాది షోడశోపచార పూజయాచ, అవసర నైవేద్యాచ, మహానైవేద్యాచ, భగవాన్ సర్వాత్మకః॥

సర్వం శ్రీవరసిద్ధివినాయక దేవతార్పితమస్తు,

అని ఉదకమును పళ్లెరములో నుంచవలెను.

గణేశప్రసాదం యజమానస్య శిరసాగృహ్ణాతు,

అని అక్షతలు పుష్పం శిరస్సున నుంచుకోవలయును. తరువాత కథ చెప్పుకోవలెను.

కథానంతరం, కేశవాది నామములతో లఘువుగా పునఃపూజ చేయవలయును.

రాత్రి ఉదయం పూజచేసి, ఉద్వాసన చేయవలెను.

## ఉద్వాసనచెప్పి కదిలించేమంత్రం.

యజ్ఞేన, యజ్ఞ, మయజంత, దేవాః, తానిధర్మాణి, ప్రథమాన్యాసన్, తేహనాకం, మహిమానస్సచంతే, యత్ర పూర్వేసాధ్యాస్సంతిదేవాః॥ శ్రీవరసిద్ధివినాయకాయనమః, యథాస్థానం, ప్రవేశయామి. హరిః, ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు, శ్రీసీతారామార్పణమస్తు,

అని స్వామిని కదిలించవలెను.

ఓం తత్సత్,

## శ్రీవరసిద్ధివినాయక పూజావిధి సమాప్తం.

వినాయకచవితినాడు చంద్రునిజూచిన దోషపరిహారమగుటకు యీ క్రింది శ్లోకము పద్యములు సంతరు చదువుకొనవలెను.

శ్లో॥ సింహః ప్రసేనమవధీ । సింహో జాంబవతాహతః ।
సుకుమారక మారోదీ । స్తవహ్యేషశ్యమంతకః॥

క. సత్రాజిత్తు నిశాచర।శత్రునకుంగీడుసేసి సద్వినయముతోఁ
బుత్రి శమంతకమణియును । మైత్రిం గొని తెచ్చియిచ్చె, మనుజాధీశా ॥

* * * * *

క. ఘనుఁడు భగవంతు డీశ్వరుఁ।డనఘుఁడు మణిదెచ్చియిచ్చి నట్టి కథనముఁ । వినినఁ బఠించినఁ దలచినఁ జనులకు దుర్యశముఁ బాప సంఘముఁ వలఁగున్. ॥ ( భాగవతము )

# ప్రార్థన.

శ్లో॥ శుక్లామ్బర ధరంవిష్ణుం, శశివర్ణం చతుర్భుజమ్,
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే॥ 1

శ్లో॥ సుముఖశ్చైక దంతశ్చ । కపిలో గజకర్ణకః,
లంబోదరశ్చ వికటో । విఘ్నరాజో గణాధిపః,
ధూమకేతుగణాధ్యక్షః । ఫాలచంద్రో గజాననః,
వక్రతండశ్శూర్పకర్ణో । హేరంబ స్స్కందపూర్వజః॥ 2

శ్లో॥ షోడశైతాని నామాని । యః పఠేచ్ఛృణుయాదపి
విద్యారంభే వివాహేచ । ప్రవేశే నిర్గమేతథా,
సంగ్రామే సర్వకార్యేషు । విఘ్న స్తస్య నజాయతే॥ 3

శ్లో॥ ఏకదంతం మహాకాయం । తప్తకాంచన సన్నిభం,
లంబోదరం విశాలాక్షం । వందేహం గణనాయకం॥ 4

శ్లో॥ గజాననం భూతగణాధిసేవితం । కపిత్థజంబూఫలసార
భక్షితం । ఉమాసుతం శోకవినాశకారణం । నమామి
విఘ్నేశ్వర పాదపంకజం॥ 5

ఉ॥ తుండము నేకదంతమును తోరపుబొజ్జయు వామహస్త
మున్ । మెండుగ మ్రోయుగజ్జెలును మెల్లనిచూపులు
మందహాసమున్ । కొండొక గుజ్జురూపమున కోరినవిద్యల
కెల్ల నొజ్జవై । యుండెడి పార్వతీతనయ యోయిగణా
ధిప నీకుమ్రొక్కెదన్. 1

చ॥ తొలుతన విఘ్నమస్తనుచు ధూర్జటినందన నీకుమ్రొక్కె-
దన్ । ఫలితము సేయుమయ్య నినుబ్రార్థనజేసెద నేక
దంతనే । వలపలిచేతి ఘంటమున వాక్కున నెప్పుడు
బాయకుండుమీ । తలపున నిన్ను వేడెదను దైవగణా
ధిప లోకనాయకా. 2

క॥ తలచితినే గణనాధుని । దలచితినే విఘ్నపతిని దలచిన
పనిగా । దలచితి,నే హేరంబుని । దలచితి నావిఘ్నకార్య
సఫలతకొరకున్. 3

కం॥ అటుకులు కొబ్బరిపలుకులు । చిటిబెల్లము నానుబ్రాలు
చెరుకురసంబున్ । నిటలాక్షు నగ్రసుతునకు । బటుతర
ముగ విందుజేసి ప్రార్థింతుమదిన్. 4

కం॥ చంగల్వలు చేమంతులు । సంగతిగా కోసితెచ్చి చతు
రత మరియున్ । బంగారు గొడుగునిడుకొని । శృంగా
రముగాగ పూజసేయుదు తండ్రీ. 5

సీ॥ సిద్ధివిఘ్నేశ. ప్రసిద్ధిగా పూజింతు
నొనరంగ నిరువది యొక్కపత్రి
దానిమ్మ మరువము దర్భ విష్ణుక్రాంత
వుమ్మెత్త దూర్వార వుత్తరేణి
కలువలు మారేడు గన్నేరు జిల్లేడు
దేవకాంచన రేగు దేవదారి
జాజి బల్‌రక్కశి జమ్మి వావిలి
తుమ్మి మఱి మాచిపత్రియు మంచిమునగ

గీ॥ గంధ మక్షతలును దీపకాంతులొప్ప
భాద్రపద శుద్ధచవితిని పగటివేళ
కుడుములును నానుబాలును కోమరుమిగుల
కోరిపూజింతు సంపదకొఱకు నిన్ను. 6

సీ॥ పార్వతీశ్వరపుత్ర భవ్యసుచారిత్ర। వేదవేద్యగణేశ విఘ్న
నాశ। గజవక్త్రచామర కర్ణలంబోదర। పాశమంకుశ
మూను పాపహర। రవిశశివర నేత్ర రమణీయ శుభగాత్ర।
ఇలమహా బలవంత ఏకదంత। భద్రేభతుండము బ్రహ్మ
దండము। ముంజికుండలితతి మేన నుంచునమర॥

గీ॥ కుంజరానన యెపుడు నీకుఁ బరభక్తి
భాద్రపద శుద్ధచవితిని ప్రకటముగను
బూజనముసేతు పార్వతీపుత్ర నిన్ను
కోర్కెలీడేర్చు సంపద కోమరుమిగుల. 7

మ॥ పానకంబులు। చలిమియుండలు। పచ్చిబియ్యము తేనె
తోన్। నానినట్టివి। జున్నుముద్ద లనంతపొంగలి బోనముల్।
మేము నీకయి తెచ్చినారము, మీకృపన్ గయిసేయగా
మానితప్రతిభా వినాయకా। మమ్ము నేలి గ్రహింపుమా॥

—♦ వినాయకుని పంచరత్నములు. ♦—

మ॥ సామజానన నీ మహాత్త్వము। సన్నుతింపగ విందురా,
వేమరుంగొని యాడు నరులను। వింతగా మదినెంతుగా,
ప్రేమమీరగ సాధుజనులకు। స్వామివీవని గందురా,
కామితార్థ ఫలప్రదాయక। కంచుతేసు వినాయకా॥ 1

మ॥ నీమహత్వము లెల్ల ధరలో । నిత్యమై వెలుగొందుగా,
ఓ మహాత్మక, భక్తపోషక.। ఓయిమూషక వాహనా,
మామదింగల కోర్కెతీర్చుము మహితవర్తన మానితా,
కామితార్థ ఫలప్రదాయక । కంచుతేరు వినాయకా॥ 2

మ॥ తూర్యములు మ్రోయంగ । మోదముతో నొసంగెడి, పువ్వులన్,
ఆర్యులందఱు దెత్తురపుడ । యంబుజానన నీకునై।
సూర్యకాంతిప్రభల్ చెలంగగ। సొబగునింపెడి కాంతులన్,
కార్యసిద్ధి ఫలప్రదాయక । కంచుతేరు వినాయకా॥ 3

మ॥ జాముజామునకు నానుబియ్యము । జాలకొబ్బరికాయలున్,
కోమలాంగులు దెత్తురప్పుడు।కుడుములుండ్రముపూర్ణముల్
నేమనోహరమైన చక్కెర । నీకు దెత్తు గజాననా
కామితార్థ ఫలప్రదాయక । కంచుతేరు వినాయకా॥ 4

మ॥ రాజపూజిత రాజశేఖర। రాజరాజ మనోహరా,
భూమిపాలక భోగిభూషణ । బుధజనోన్నత కీర్తిదా,
మామనోహర భక్తవత్సల । నాథనాథ వినాయకా,
కామితార్థ ఫలప్రదాయక । కంచుతేరు వినాయకా॥ 5

### విఘ్నేశ్వరుని దండకము.

శ్రీపార్వతీపుత్ర లోకత్రయీస్తోత్రి । సత్పుణ్యచారిత్రి భద్రేభవక్త్రా మహాకాయ । కాత్యాయనీనాథ సంజాత స్వామీ । శివాసిద్ధివిఘ్నేశ । నీపాదపద్మంబులన్ । నీదుకం

తంబు, నీబొజ్జ నీమోము, నీమౌళి, బాలేందుఖండంబు, నీ నాల్గుహస్తంబులున్, నీకరాళంబు, నీపెద్దవక్త్రంబు, నీయేక దన్తంబు । నీపాదహస్తంబు, లంబోదరంబున్ । సదా మూషకాశ్వంబు । నీమందహాసంబు । నీచిన్నతుండంబు । నీ గుజ్జురూపంబు । నీశూర్పకర్ణంబు । నీనాగయజ్ఞోపవీతంబు । నీభవ్యరూపంబు । దర్శించి హర్షించి సంప్రీతిమ్రొక్కంగ శ్రీగంధముం కుంకుమం । బక్షితల్జాజులున్, చంపకంబుల్, తగన్ మల్లెలున్, మొల్లలున్, మంచిచేమంతులున్, దెల్ల గన్నేరులన్ । మంకెనల్ । పొన్నలున్, పువ్వులున్, మంచి దూర్వంబులన్ దెచ్చి. శాస్త్రోక్తరీతిన్, సమర్పించి, పూజించి సాష్టాంగమున్ జేసి విఘ్నేశ్వరానీకు, టెంకాయ, పొన్నంటి పండ్లున్ । మఱిన్ మంచిగానిక్షుఖండంబులున్, రేగుపండ్లప్ప డంబుల్ వడ ల్పేంబు బూరెల్ మఱిం గోధుమప్పంబులున్ పున్గులున్ బూరెలున్ గారెలున్ చొక్కమా చక్కెరల్ చల్మిడిన్, బెల్లమున్. దేనెయున్, జున్నుబాలా జ్యము న్నానుబియ్యంబు నామ్రంబు బిల్వంబు మేల్బంగ రున్ బళ్లెమందుంచి నైవేద్యమర్పించి నీరాజనంబున్ । నమ స్కారముల్ జేసి । విఘ్నేశ్వరానిన్ను, బూజింపకే యన్య దైవంబులన్ బ్రార్థనల్ సేయుటల్ కాంచనంబొల్లకే యిన్ము దాగోరు,చందంబుగాదే మహాదేవ, యోభక్తమందార, యో సుందరాకార,యోభావ్యగంభీర, యోదైవచూడామణీ, లోక రక్షామణీ, బంధుచింతామణీ, స్వామి నిన్నెంచనేసంత, నీ దాసదాసానుదాసుండ । శ్రీమంతుగాజూచి, హృత్పద్మ

సింహాసనారూఢతన్నిల్పి, కాపాడుటేకాదు, నిన్గొల్చిప్రార్థించు భక్తాళికిన్, గొంగుబంగారమై, కంటికిన్ రెప్పవై, బుద్ధియున్, విద్యయున్, వాడియున్ బంటయున్, బుత్రపౌత్రాభివృద్ధిన్ దగన్ గల్గగా జేసి పోషించుమంటిన్, గృహన్ గావుమంటిన్, మహాత్మా యివె వందనంబుల్ శ్రీగణేశా నమస్తే నమస్తే నమస్తే నమః.

## విఘ్నేశ్వరుని మంగళ హారతులు.

శ్రీశంభు తనయునకు । సిద్ధిగణనాథునకు । వాసిగల
దేవతా వందితునకు । ఆసరస విద్యలకు । ఆదిగురువైనట్టి ।
భూసురోత్తమ లోక పూజ్యునకును॥ జయ ॥ 1

నేరేడు మారేడు । నెలవంకమామిడి । దూర్వార చెం
గల్వ పుత్తరేణు । వేరు వేరుగ దెచ్చి వేడ్కతో పూజింతు ।
పర్వమున దేవగణపతికి నిపుడు॥ జయ ॥ 2

సుచిరముగ భాద్రపద శుద్ధ చవితియందు । పొసగ
సజ్జనులచే పూజగొంచు । శశిచూడరాకున్న చేకొంటినొక వ్ర
తము । పర్వమున దేవగణపతికి నిపుడు॥ జయ ॥ 3

పానకము వడపప్పు । పనసమామిడిపండ్లు । దాని
మ్మఖర్జూర ద్రాక్షపండ్లు । తేనెతో మాగిన తియ్యమామిడి
పండ్లు । మాకు బుద్ధిచ్చు గణపతికినిపుడు॥ జయ ॥ 4

ఓబొజ్జగణపయ్య నీ బంటునేనయ్య । ఉండ్రాళ్ళమీ దికి దండుబంపు । కమ్మని నెయ్యియును । కడుముద్దపప్పు యును । బొజ్జవిరగదినుచు పొరలుకొనుచు॥ జయ ॥ 5

వెండిపళ్ళెరములో వెలలేనిముత్యాలు । కొండలుగ నీలములు । కలియబోసి । మెండుగను హారములు । మెడనిండవేసికొని । దండిగా నీకిత్తు ధవళారతీ॥ జయ ॥ 6

పువ్వులను నినుగొల్తు । పుష్పాల నినుగొల్తు। గంధాన నినుగొల్తు కస్తూరిని । ఎప్పుడును నినుగొల్తు ఏకచిత్తంబున। పర్వమున దేవ గణపతికినిపుడూ॥ జయ ॥ 7

ఏకదన్తంబును ఎల్లగజవదనంబు । వాకైన తొండంబు వలపుకడుపు । జోకయిన మూషకము । సొరదినెక్కాడేవు భవ్యమున దేవగణపతికినిపుడు॥ జయ ॥ 8

మంగళము మంగళము । మార్తాండతేజునకు । మంగళము సర్వజ్ఞ వందితునకు । మంగళము ముల్లోక । మహిత సంచారునకు మంగళము దేవగణపతికినిపుడు॥ జయమంగళం। నిత్య శుభ మంగళం. 9

మోదకము వుండ్రాళ్లు । ముద్దపప్పుతో నెయ్యి । ఆదిగాగలతేనె అమృతాన్నముల్ । ఆదరంబుగతృప్తి తానారగింపుమను । పర్వమున దేవగణపతికి నిపుడు॥ జయ ॥ 10

ఓ బొజ్జగణపతి ఓర్పుతో రక్షించి । కాచినన్నేలుమీ కరుణతోను । మాపాలగలవని మహిమీద నెల్లపుడు । కొనియాడి మ్రొక్కెదను । కోర్కెదీర ॥ జయ ॥ 11

## లాలిపాట.

లాలిశ్రీగణనాథ లాలిగణనాథా।లాలితంబుగ మమ్ము నేలుకొనరాదా । బాలురందరమిటుల భక్తితోడుతను చాలగా నినువేడ జాలితేదటరా ॥ లాలి ॥ విఘ్నంబులెల్ల నిర్విఘ్నంబు జేసి । విఘ్నేశ్వరా మాకు విద్యలనొసంగి । సకల విద్యలలోన చతురులను జేసి । ప్రకటితంబుగ మమ్ము బాలింప వయ్య ॥లాలి॥ రక్షించు దొరవనుచు రహినొప్పవినుచు । భక్ష్యముల్ వడపప్పు పాయసంబులును । నీసన్నిధికి తెచ్చి నీకొసగినాడా । నాసతోభుజియింపుమయ్య విఘ్నేశా ॥లా॥ కర్పూరహారతులు కడు వేడ్కతోడ । నేర్పుతోడుత నిచ్చి నిలచి మొక్కితిని । దోసిలొగ్గితి దొడ్డదొరవనుచు నమ్మి । భాసురంబుగ వరబ్రహ్మదాసనుత ॥లా॥

—♦ కథాప్రారంభః. ♦—

1. పూర్వకాలమందు చంద్రవంశమందుబుట్టి ప్రసిద్ధుడైయున్న ధర్మరాజు దైవయోగమువలన కుటిలులయిన దాయాదులచేత రాజ్యము నపహరించబడి నలువురు తమ్ములతోడను, భార్యయైన ద్రౌపదితోడనుం గూడ, ననేక వృక్షములచేతను, వ్యాఘ్రభల్లూకాద్యనేక ఘాతుకమృగముల చేతను, హంసచక్రవాకాది బహువిధపక్షులచేతను, నిండి నిబిడీకృతంబయియున్న వనమునకుం బోయి యక్కడక్కడ నుండెడు బ్రహ్మవాదులను, సూర్యాగ్నిసమాన తేజోవంతులను, వాయు పర్ణ జలాహారులును, అగ్నిహోత్రోపాసకు

లును, అతిథిపూజకులును, ఊర్ధ్వబాహులు, నిరాలంబులును నగు మునీంద్రుల జూచుచు ధర్మరాజు సంభ్రమముతో గూడుకొన్నవాడై సూతుని యాశ్రమంబునకుం బోయి భార్యతోను దమ్ములతోనుగూడ ఋషీశ్వరునకు నమస్కరించి సూతునిజూచి ధర్మరాజు పలుకుచున్నాడు—

2. సర్వశాస్త్ర విచక్షణుడవును, మహాప్రాజ్ఞుడవును, కరుణానిధియు నగు యో సూతా! మేము భార్యతో దాయాదులచేత మిక్కిలి బరిభవింపబడియు, మాయొక్క సకలరాజ్యములును పుత్రసంపత్తులును కూడ జ్ఞాతులచేత నపహరింపబడినవి. ఇప్పుడు మీ దర్శనముచేత మా సమస్తదుఃఖముపోగొట్టబడినది. మామీదకృపయుంచి మాకు రాజ్యము సిద్ధింపజేయునట్టి యొక్కవ్రత మానతిమ్మని యడుగగా సూతుడు పలుకుచున్నాడు—

3 వినుండు పాండవులారా! మనుష్యులకు సర్వసంపత్కరంబును, సకల సౌఖ్యాభివర్ధనంబును, వ్రతములలో నుత్తమంబును; సకలపాప వినాశకరంబును, పుత్రపౌత్ర ప్రవర్ధనంబును నగు రహస్యమయిన వ్రతము బూర్వకాలమందు కుమారస్వామికి శివునిచేత నుపదేశింపబడెను—అదియెట్లన—

4 ప్రమథాది గణసేవితంబును, నానారత్న విభూషితంబును, రమణీయంబును నగు కైలాసగిరి శిఖరమునందు మందార వృక్షచ్ఛాయ స్వర్ణ సింహాసనమందు, పార్వతీసహితుడయి కూర్చున్న లోకసౌఖ్య కరుండయిన సాంబమూర్తిని

లోకుల ననుగ్రహించ వలయునను నిచ్ఛచేత వినమ్రుడై కుమారస్వామి పృచ్ఛచేసెను.

5. మహాదేవుండవు భగవంతుండవునైన యో సాంబ శివా! మనుష్యుడే వ్రతముచేత, నసమానమైన సౌభాగ్యంబును, బుత్రసంపదలును బొంది సుఖము ననుభవించుచున్నాడు? అట్టి యుత్తమ వ్రతమును నా కానతిమ్మన, శివుండిట్లనియె.

6. ఓయీ కుమారుడా! సర్వ సంపత్కరంబును నుత్తమంబును, దీర్ఘాయుష్య కామ్యార్థసిద్ధి ప్రదంబునునగు, గణపతి పూజయనెడు నొక వ్రతముగలదు. ఆవ్రతము భాద్రపద శుక్ల చతుర్థి నాడాచరింపవలసినది. అది యెట్లనిన, ప్రాతఃకాలమందు స్నానముజేసి శుద్ధ వస్త్రధరుండయి నిత్యకర్మలదీర్చి వాని శక్త్యానుసారము బంగారుచేనైనను, వెండిచేనైనను, బంకమట్టిచేతనైనను ధనలోభము చేయక విఘ్నేశ్వర ప్రతిమ నేర్పరచవలసినది.

7. పరిశుద్ధ ప్రదేశంబున నొకమంటపంబు నేర్పరచి యా మంటపంబున వడ్లుగాని, బియ్యముగాని పోసి యందు అష్టదళ పద్మాకృతి నేర్పరచి యచ్చట గణేశుని ప్రతిష్ఠించి శ్వేతగంధాక్షతలచే వినాయకుని భక్తితో పూజించి, మౌంజీ కృష్ణాజినము, దండము, యజ్ఞోపవీతము, కమండలము, వస్త్రము, ధూప దీపంబులు వారివారి శక్త్యానుసారముగా, గణనాథునికి సమర్పించి ప్రీతితో వండిన కుడుములు మొద

లయిన పిండివంటలును, కొబ్బరికాయలు, అరటిపండ్లు, నేరేడిపండ్లు, వెలగపండ్లు, చెరుకుబిళ్లలు మొదలయిన ఫలములను ప్రత్యేకముగా దినుసుకు యిరువది యొకటి ప్రకారం నైవేద్యముచేసి నృత్యగీత వాద్యములతోడను పురాణ కథనాములతోడను గూడ గణపతి పూజను సమాప్తి నొందించి యథాశక్తిగా వేద విదులయిన బ్రాహ్మణులకు తాంబూల దక్షిణలిచ్చి బంధువులతోగూడ ఘృతపక్వములయిన భక్ష్యభోజ్యాదులతో భోజనంబుచేయవలసినది. ఈ ప్రకారముగా నెవ్వడు గణపతి పూజ చేయుచున్నాడో వానికి గణపతి యనుగ్రహమువలన అన్ని కార్యములు సిద్ధించుననుటకు, నెంతమాత్రము సంశయములేదు.

8. మరునాడు ప్రాతఃకాలమునందు పునఃపూజ చేసి ఉద్వాసన చెప్పవలయును.

9. ఓయీ షణ్ముఖా! మూడులోకముల యందును ప్రసిద్ధమయిన సకలవ్రతములలో నుత్తమమయిన యీవ్రతము పూర్వకాలమందు దేవ, ముని, గంధర్వ, కిన్నరులచేత నాచరింపబడినది. గాని సామాన్యమైనదికాదు. అని, ఈప్రకారముగా సాంబమూర్తి పుత్రుడయిన, కుమారస్వామికి ఈవ్రతము నుపదేశించెను. గనుక, ఓ ధర్మరాజా నీవును ఈ గణనాథపూజ యనెడు వ్రతము నాచరించితివేని నిశ్చయముగా నీకు శత్రుజయము కలుగును. నేను సత్యముగా జెప్పుచున్నాను అని సూతుండు జెప్పెను.

10. పూర్వకాలమందు ఈవ్రతమును దమయంతి యాచరించి నలమహారాజును పెండ్లియాడెను. శ్రీకృష్ణస్వామి యాచరించి జాంబవతిని శమంతకమణిని కూడ పొందెను. అది యెట్టిదనిన సత్రాజిత్తు మహారాజు సూర్యుని వరముచేత శ్యమంతకమణి నార్జించి స్వగృహమగు ద్వారకకుం బోవ సూర్యునివలె ప్రకాశించుచున్న నారత్నమును దామోదరుం డడుగగా దానిని సత్రాజిత్తివ్వకపోయె. నంత గొన్నిదినములకు సత్రాజిత్తుని తమ్ముడామణినిధరించి వేటకుబోవ నొక సింహంబు వాని వధించి ఆమణి నెత్తుకొని పోవుచుండ నాసింహంబును జాంబవంతుడు జంపి మణిని తనగుహకుం దీసుకొని పోయెను. సత్రాజిత్తు తన తమ్మునిజంపి శమంతకమణిని కృష్ణుడపహరించెనని చెప్పుకొనుచుండగా శ్రీకృష్ణుడు తాను వినాయకునిచే శపింపబడిన చవితిచంద్రుని క్షీరఘటమునందు జూచుటచే దనకిట్టి యపవాద సిద్ధించెనని బలభద్రునితో జెప్ప నతండు చవితిచంద్రునకు వినాయకుడేల శాపంబిడియెనని యడుగగా, అన్నా! వినాయకుండు కైలాసంబున నొకనాడు కుబ్జరూపుండయి వెలుగుచుండ నతనిజూచి చంద్రుడు నవ్వగా వినాయకుండు చంద్రుని జూచి నిన్ను చవితిదినంబున నెవ్వరేనియుం జూతురేని వారి కపవాదము సిద్ధించునని శపింప, చంద్రుడతిదీనుండయి వేడిన

వినాయకుఁడు స్కందునకు శంభు డానతిచ్చినప్రకారము భాద్రపద శుద్ధ చతుర్థిదివసమందు నన్ను యథావిధి నర్చించి వ్రతంబుఁ సలుపువారికి సంభవించిన యపవాదము తొలగి శత్రుజయమును మోక్షసామ్రాజ్యసిద్ధియు ధనకనకవస్తువాహనాద్యనేక వస్త్రాభరణ పుత్రపౌత్రగోమహిష్యాభివృద్ధియుఁ గలుగునని వినాయకుఁడు చంద్రునకు వరమిచ్చెను. నిట్టి వ్రతము చంద్రుడు మొదలగువారు జేసిరిగాన నీవ్రతమును చేయవలయునని కృష్ణుఁడు బలభద్రునితో జెప్పెను. బలభద్రుఁడు దనపురంబునఁ జాటించి కృష్ణుడు మొదలగువారావ్రతమును సల్పిరి. పిమ్మట కృష్ణుండు వినాయకుని ప్రసాదంబుచే జాంబవంతునియొద్దకుం బోవ నతం డాశ్యమంతకమణియును జాంబవతియను తన కూతురుని నిచ్చిన, నారత్నమును కృష్ణుండు సత్రాజిత్తునకిచ్చి దన యపవాదము తొలగించుకొనియెను. సత్రాజిత్తు సత్యభామయను కూతురుతో శ్యమంతకమణిని కృష్ణునకిచ్చి తన యపరాధము మన్నించుమని వేడెను. శ్రీకృష్ణుడు జాంబవతిని సత్యభామను పెండ్లాడి యథేచ్ఛగా నుండెను.

11. వృత్రాసురవధ చేయబోవునపు డింద్రుఁడును సీతాదేవిని వెదకునపుడు రాముండును, గంగను భూమికిదెచ్చునపుడు భగీరథుండును, అమృతోత్పాదనము సేయునపుడు

దేవాసురులును, కుష్ఠువ్యాధి నివృత్తికొరకు సాంబుండును, యీశపుత్ర ప్రసాదముచే సిద్ధికాములయిరని సూతుండు జెప్పగా ధర్మరాజు తమ్ములతోగూడ నీవ్రతమునునాచరించి పరాక్రమముచేత శత్రువులను జయించి రాజ్యమును పొందెను.

12. మనస్సున తలచిన కార్యములన్నియు వినాయక పూజవలన సిద్ధించుచున్నవి. కాబట్టి గణేశుడు సిద్ధివినాయకుండని లోకమందు ప్రసిద్ధిపొందెను. విద్యారంభకాలంబున పూజించిన విద్యాలాభము నిశ్చయముగా గలుగును. జయము గోరినవారికి జయంబును, పుత్రులు గోరినవారికి పుత్రులును, పతినిగోరిన కన్యకకు సురూపుడగుపతియును, సౌభాగ్యమును గోరిన ముత్తయిదులకు సౌభాగ్యంబును గలుగును. విధవ పూజించెనేని మరుజన్మమందు వైధవ్యమునుపొందదు. కాబట్టి ఆబాలవృద్ధాదులు యథావిధిగా భక్తితో వ్రతము నాచరించిరేని గణపతి యనుగ్రహమున సకలకార్యసిద్ధి, పుత్రపౌత్రాభివృద్ధి, యెనుగునెక్కునంతటి యైశ్వర్యమును బొంది సుఖమును గాంతురు.

ఇతిస్కాన్ద పురాణేస్కంద మహేశ్వర సంవాదే
వినాయక వ్రత కథ సమాప్తము.

---

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః। పరిపాలయంతాం, న్యాయ్యేనమార్గేణ మహీం మహీశాః । గోబ్రాహ్మణేభ్య। శుభమస్తునిత్యం లోకా సమస్తాః । సుఖనోభవన్తు. ॥

ఓం శాంతిః, శాంతిః, శాంతిః ॥

# విజ్ఞాపన.

విఘ్నరాజ మహంభజే, శుభాశుభములగు అన్నికార్యములకు ప్రధాన దైవతము గణనాథుడు. "జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ" అన్నట్లు విశ్వమునకు తలిదండ్రులగు పార్వతీ పరమేశ్వరుల తొలి ముద్దుబిడ్డడు అవరుసన మనకు పెద్దన్న గజాసుర సంహార మొనర్చిన వీరసోదరుడునగు బొజ్జయ్యకు "విత్తశాఠ్యన్న కారయే" త్రివిద్రవ్యగుణసంపత్తులు గల భక్తులు గొందరు, గణపతి నవరాత్రములుచేయుదురు మనమో యథాశక్తిని సంవత్సరమున కొక దివసమునం దయినను భక్తిప్రేమలతో బూజాద్యుపచారములుచేసి విన్రములముగానియెడ "పితృసమో జ్యేష్ఠః" యను ధర్మమును మీరినవారల మగుదుము:— నేను పలుమారు లీ గ్రంథాలయమునకు వచ్చుచుండుటచే, గ్రంథాలయ సంఘమువారిచే తయారుకాబడినశ్రీవిఘ్నేశ్వరపూజావిధానమను ఈచిన్నగ్రంథము నన్ను సవరించమని కోరిరి. నేను యథాశక్తిని అపసికి నియ్యకొంటిని. ఈగ్రంథమునందుగల పూజావిధానమునకు క్రియలు, తెల్గుతాత్పర్యముతో విపులముగా వ్రాసియున్నందున ఆబాలవృద్ధులలో అక్షరాస్యులు స్వతంత్రముగా ఈ గ్రంథసహాయమువలనపూజచేసుకొనుట కెంతయు తగియున్నదని నమ్ముచున్నాను:—ఈగ్రంథాలయమువారు ప్రజలకు ఇట్టిఉపయోగములనేకములు కలిగించుచుండ గలందులకు ఈ గ్రంథాలయ పాలకులకు ఇతోధికైశ్వర్యాభివృద్ధి భగవంతు డనుగ్రహించుగాక:—గ్రంథాలయము దినదిన ప్రవృద్ధి గాంచుగాక:—

సా॥ ఈలప్రోలు.<br>పోలుమకాం, బెజవాడ<br>ది29-8-32.

ఇట్లు భాషాసేవకపరమాణువు,<br>మార్తి సూర్యనారాయణశాస్త్రి,<br>గ్రామపాఠశాలోపాధ్యాయి.

47

# పండితాభిప్రాయము.

విచిత్రాష్టావధాని, నాటకచక్రవర్తి, విద్వత్కవి బిరుదాంకితులగు బ్రహ్మశ్రీ
మల్లాది అచ్యుతరామశాస్త్రులుగారు,
శ్రీకన్యకాపరమేశ్వరీ హిందూహైస్కూల్ ప్రధానాంధ్రోపాధ్యాయులు,
బెజవాడ, 29-8-32.

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరాంధ్ర గ్రంథాలయ సంఘమువారిచే బ్రకటితమయిన శ్రీ విఘ్నేశ్వర పూజా విధానమను ఈ గ్రంథము సర్వజనోపయోగము వినాయక వ్రతము ఆస్తికులందఱికి ముఖ్యమయినది. ప్రతివారు శక్తి వంచనలేక చేయుట యాచారమయినది ఆ వ్రతదినము పురోహితుఁడు ప్రతివారికి సమయమునకు రాఁజాలఁడు. పిల్లలు భోజనాదులు కాలమునకు లేకపోవుటచే పూజాదులయందు బత్తియుండదు. మఱి యాయాసపడుదురు. కావున నీసంఘమువారు సాక్షరులగువారికి (అనగా జదువు కొనినవారు) పరుల సహాయములేకుండ, తమంతట తాము పూజచేసికొనుటకు వీలుగా నుండుటకు నీ గ్రంథాలయ సంఘమువారు పెక్కులు గ్రంథములు పరిశీలించి యనేక సాంప్రదాయము నాలోచించి పండితులచేఁ బరిష్కృతము గావించి, యీ పుస్తకము అచ్చువేయించినారు. గావున నీగ్రంథము స్త్రీ పురుషాదులకందఱికి, మిక్కిలి యుపయోగమవునని నా ముఖ్యాభిప్రాయము.

---

# అభిప్రాయములు.



మ॥ రా॥ శ్రీ సోమనాథ వెల్లటూరుగారు.

సుప్రసిద్ధాంగ్లకవులు

బెజవాడ, 1-8-32.

శ్రీ భ్రమరాంబా మల్లేశ్వ రాంధ్రగ్రంథాలయమును నేను యీరోజున సందర్శించితిని, ఈ సంస్థను స్థాపించి పోషించుచున్నవారు వందనీయులు, ఈ గ్రంథాలయములో ఆంధ్ర సంస్కృత గ్రంథములు చాలా గలవు. ఆంగ్లగ్రంథములు కొలదిగా నున్నవి. మాతృభాషాభివృద్ధికి యీ గ్రంథాలయము చాలా తోడ్పడుచున్నదని నా యభిప్రాయము సామాన్యులకు యీ గ్రంథాలయము చాలా సహాయభూతము కాగలదు. గ్రంథపఠనమేగాక, నేటి నాగరికతాప్రపంచమున విజ్ఞానవ్యాప్తికి తోడ్పడుచుండిన బహిరంగసభలు, ఉపన్యాసములు, చిత్రకళాప్రదర్శనములు, హరికథలు, బయస్కోపు, మ్యాజిక్కులాంతరు మొదలగు పరికరముల ద్వారా పామరజనులలో కూడ విద్యావ్యాప్తి చేయుట కీగ్రంథాలయము పూనుకొనదగునని నా కోరిక. ఈ గ్రంథాలయము సర్వతోముఖముగా దినదినాభివృద్ధి గాంచి ఆంధ్రదేశమున కలంకారభూషణమై దనరుగాత.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B197 |
| పుస్తకం పేరు | విఘ్నేశ్వర పూజావిధానము |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 65 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CF, BCF |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Uma |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |